Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ జూలై నెల 24 వ తేదీ శుక్రవారం [నె 29 రు.



బ్రిటిషు నౌకాదళానికి చెందిన విమానం ఒకటి, ముంచబడిన స్టీమరులోని నావికులు నీట కొట్టుకొనుట జూచి రక్షించిన విధం పై పటంలో అగుపించును. వైమానికుడు విమానాన్ని నీటిపై దింపి, తాను యీదుచుపోయి ఒక పడవను వారివద్దకు తెచ్చి అందు వారిని ఎక్కించెను. ఇంకో విమానం పైనెగురుచు ఆతనికి గుర్తులు చూపుచుండెను. ఈ పనిలో విమానం యించుక చెడెను. కాని ఆయన నావికులను వేరొక స్టీమరు వచ్చువరకు పడవ నెక్కించి రక్షించగల్గినందుకు అతనికి బ్రిటిషు సామ్రాజ్య పతాక మొసంగబడెను.

---

# జపానుయొక్క అధికార దుర్వాంఛను పాతేయాలి.

## మీ విభేదాలు మరచిపోయి మిత్రులతో కలసి పోరాడండి.

గ్లస్టరు ప్రభుని వీడ్కోలు సందేశం.

జార్జి రాజుగారి సోదరుడు గ్లస్టరు ప్రభువు ఇండియాను వీడి వెడలిపోవుచూ యీ నెల 16 వ తేదిన రేడియోద్వారా, భారతీయులందరు విభేదాలను మరచి మిత్రులతో కలసి నాజి ఫాసిష్టు తత్వాలను అణచివేయుటకును, జపానుయొక్క అధికార దుర్వాంఛను పాతిపెట్టుటకును కృషిచేయాలని హెచ్చరించిరి.

ప్రభువుగారు యిట్లు నుడివిరి :—ఇండియా సింహళములందు నా సంచారము ముగిసినది. మీవద్ద శలవుగైకొని వెడలుట నా విధి. ఈ నెల్లాళ్లలో నేను చూడామనుకొన్నంత మందిని గాని, అన్ని స్థలాలుగాని చూడ లేకపోయినను, చూచినంతవరకు గత కొద్ది వారాలలో అనేక రకములగు అనుభవజ్ఞానం గడించితిని. నా అభిప్రాయములను మీకు తెలుపగోరెదను.

నేను చాలవరకు విమానంపై సంచారంచేసితిని. రైలు మోటారులపైగూడ ఎక్కువ దూరం పోతిని. కరాచినుండి కలకత్తావరకు, కొలంబోనుండి కైబరు కనుమలవరకు ఇండియా-సింహళముల పొడుగు వెడల్పులన్ని తిరిగి చుట్టితిని. ఇండియాలోని అత్యుష్ణమును సహించి, వాన, దుమ్ముకూడ అనుభవించితిని. కాని నే గాంచిన కొన్ని అందమైన స్థలములు పైవాటిని మరిపించినవి.

నేనుపోయిన చోట్లనెల్ల చాల ఆదరణతో సన్మానించిరి. చూసినవారిలో పెక్కుమందిని క్రొత్త స్నేహితులుగ చేసుకొంటిని.

ఐకమత్యానికే అనుగుణ్యమయిన దేశం.

దేశమంతా సింహావలోకనం చేసిన పిమ్మట నాకు కొన్ని స్పష్టమయిన అభిప్రాయాలు కలిగినవి. నాకు మున్ముందు తోచిన దేమంటే, ఇండియా ఐకమత్యాని కనుగుణ్యమయిన నైసర్గిక పరిస్థితులుగల దేశం. అంతర్విభేదాలున్నచో చాలనీరసమగు దేశమగును; ఐకమత్యం కలిగియున్నచో మితిలేని మహాశక్తివంతమగు దేశం కాగలదు. ఇంత విశాలమయిన దేశంలో జాతిమత భాష ఆచార విభేదములుండక తప్పదుగాన, అంతా ఒక్కలాగ నుండలేరు కాని, ఐకమత్యంతో నుండవచ్చును; అట్టి ఐకమత్యం చేకూర్చుటకు విభేదాలను తొలగించుటకు, దేశంలో ఐకమత్యా వశ్యకతను నచ్చజెప్పుటకును అపుడే మంచి అవకాశము లగపడుచున్నవి. అట్టి అవకాశములలో ఘనమైనది యుద్ధం ఒకటి.

జయించే దృఢసంకల్పం.

ఇండియాలో యీ కొసనుండి ఆ కొసవరకును, సింహళంలోను నేను పోయిన తావులన్నింటియందు నేను చూచిన అందరిలోను, నాకుచేరిన వందలకొలది ఉత్తరాలలోను ఒకే ఒక భావం ప్రబలియుండుట గాంచితిని—అదేమన, మనం జయించక తప్పదనియు, జయించగలమను విశ్వాసమును కలిగియున్నారు. ఈ భావం ఎంత ఎక్కువగా ఎంత బలవత్తరంగా వ్యాపించియున్నదో ఇండియాలోగాని వెలుపలగాని బాగా గుర్తింపబడలేదని అనుకుంటాను. ఎందువల్లనంటే ప్రస్ఫుటంగా వక్కాణింపబడ లేనందున.

సందేహించుచున్న కొలదిమంది మాత్రం బాహాటంగా తమ సందేహాలను చెప్పుతున్నారు; యుద్ధ కృషిలో తమ శక్తినంతా దారపోస్తున్న పెక్కుమంది మాత్రం మవునంగానుండి, తమ పని చేసుకుంటున్నారు. ఇట్టివారినే చూచుటకు నేను వచ్చితిని, వారిని ప్రోత్సాహించదలచితిని. క్రొత్తగ నేర్పడి ఇండియాకు చాల సేవచేయుచుండిన నేషనలు వారు ఫ్రంటు (జాతీయ సమరాంగణం) ఉద్యమంద్వారా వారి కృషి అందరికి తెలియుచున్నది. రాజభక్తిగల కోట్లకొలది ప్రజల అభిప్రాయం బయటకు తెలియాలి.

వారిలో చాలమంది నాకు తెలియజేసిన భావం ఏమంటే, ఇండియాయొక్క హృదం మిత్రమండలి దేశాలగు బ్రిటను, అమెరికా, రష్యా, చీనా మున్నగు సంయుక్త రాజ్యాలన్నింటి హృదయాలవలెనే ఘట్టిపడి ధైర్యంగా దృఢసంకల్పంతో నున్నదని ప్రపంచానికి తెలియాలని. సంయుక్త రాజ్యాల దృఢమయిన సఖ్యత ప్రపంచంలో యిదివరకెన్నడు కనివిని యెరుగం.

ఇండియా సైనిక శక్తి.

నాకు కల్గిన మూడో దృఢభావం ఇండియా - సింహళముల నేటి సైనిక శక్తిని గూర్చి. బ్రిటనుతో సంబంధం మేర్పడిన తరువాత యిదివరకెన్నడు లేనంత యెక్కువశక్తిగల సైన్యం ఇపుడు ఇండియాలోనుందని విన్స్టను చర్చిలుగారు చెప్పుట మీరు వినియున్నారు. ఈ సైన్యాలను, వారి ఉత్సాహమును శక్తిని నేను ఇండియాలోను సింహళంలోను చూచియున్నాను. వారు కాపలా కాయుచున్న రక్షణములను చూచితిని. వారివెనుక తోడ్పడుచున్న సివిలు డిఫెన్సు పనివారినికూడ చూచితిని.

ఆధునిక యుద్ధమునందు, యే దేశమూ అజేయంకాదు. కాని ఇండియా - సింహళములు ఘట్టి కోటలవంటివి, వాటిపై శత్రువు దాడిచేసినచో తన ఎముకలు విరుగగొట్టుకొనును.

అంతకన్న ముఖ్యమయిన దేమంటే, మన ఆయుధ సైన్యాలే ముందుకుపోయి శత్రు వెక్కడయుంటే అక్కడకే వెతుక్కోపోయి కొట్టే శుభదినం వచ్చినపుడు, శత్రువును ఓడించి నాశనం చేయగలవు.

నేనీ మాటలుకేవలం నా ఒక్కని స్వంత అభిప్రాయాలుగ చెప్పుటలేదు. జపానువారితో స్వయంగ యుద్ధం చేసినవారిని కలసి మాట్లాడితిని. వారు జపాను ఎత్తులను నేర్చుకొనిరి. వారి మాటలు కేవలం ఊహలపై నాధారపడినవి కావు. తిరిగి జపానీయులను సరిసమానమగు అవకాశములతో ఎదుర్కొన్నచో వారిని ఓడించగలరు. జపానువారితో నెట్లు ఢీకొని ఓడించగలరో జర్మనులను ఇటలీవారినిగూడ అట్లే ఓడించగలరు.

ఇండియాలోను సింహళంలోను యిపుడున్న నౌకాదళం, విమానదళం, నేల సైన్యములు కలిసి అభేద్యంగానున్నవి. బ్రిటిషు సేనలు అధినివేశ సేనలు, మిత్రమండలి సేనలు ఇక్కడ

నున్నవి. ఇండియాలో అన్ని ప్రాంతముల నుండి వచ్చిన సాటిలేని మీ సేనలు, బ్రిటిషు రాజుకి చిరకాల మిత్రుడగు నేపాలు రాజుగారి సేనలు; అన్ని జాతులనుండి సేకరింపబడి భుజాలుకలిపి యుద్ధరంగంలో పోరాడి అపుడే పెక్కు గౌరవములను బడసిన సేనలును, యిచట నున్నవి. కావున, మిత్రులారా, మీరు వారియం దును, మీయందును విశ్వాసం గలిగియుండ గోరెదను.

నెల రోజుల క్రిందట నేను మీకు వినిపించిన మా అన్నగారి సందేశంలో, ఆతడు మీ సౌహార్ధ మును సహాకారమును కోరియుండెను. అవి ఇండియాలో నేను ఎక్కువగ గాంచితిని. కాని అవి ఎంతయున్నను తనివితీరదు. త్వరలో విజయం చేకూరినను, యీ విశ్వాసం, ధైర్యం స్థిరసంకల్పం వృధాపోవు.

నేను హైదరాబాదులో నుండగ ఉర్దూగీతం ఒకటి నాకందజేయబడెను. అందు జర్మనుల నుద్దేశించి మూడు వాక్యాలు గలవు:

" గత మహాయుద్ధం మీరు మరచినారా?

" ఎంతపైకి వెళితే అంత ఎత్తునుండి పడతారు.

" అపుడు మిమ్ము ఎట్లు ఓడించితిమో జ్ఞాపకముందా?"

నిజాయితీ.

అదియే సరియైన భావం. ఇండియాలో అట్టిభావం పూర్తిగ ప్రబలవలెను. కార్యాలు అనుకూలంగా జరగనపుడు సందేహమనే మేఘం మీకండ్ల కడ్డుతగులుచున్నపుడు యీ యుద్ధంలో నున్న నిజాయితీని గుర్తించుచు; మీ మిత్ర దేశాలయొక్కయు, డంకిర్కు వీరులయొక్కయు, బ్రిటను రక్షకులయొక్కయు మొక్కవోవని ధైర్యోత్సాహాలను గమనించుడు; రష్యా చీనా సేనల అద్భుత నిరోధము; అమెరికా సంయుక్త రాష్ట్రాల అమితసంపద మహా ధైర్యమును నిస్సంకోచమగు యదార్థములని గుర్తింపుడు, విజయం తథ్యమని నమ్మండి.

మీకుగల శక్తి సంకల్పములలో ప్రతి అణు వును యీ యదార్థ విషయములకు తోడుచేసి నచో ఇండియా-సింహళములకు విజయం చేరువ చేసిన వారగుదురు.

యుద్ధాన్ని ఒక్క గంటముందు ముగించ గల్గినచో కొన్ని వందల ప్రాణాలు రక్షింపవచ్చు ను, లక్షలకొలది ప్రజల కష్టం తొలగించవచ్చు " ఇది యింకొకరి యుద్ధం, నాకేమి సంబంధం లేదని " ఎవ్వరు అనుకోజాలరు. అన్ని విధాల యిది ప్రపంచ యుద్ధమే. తాను కోరినా కోరక పోయిన యుద్ధం తాకిడి తగలనిదేశం ఒక్కటి గూడలేదు. బ్రతికియున్న ప్రతి పురుషుడు, స్త్రీ బిడ్డకుగూడ యీ యుద్ధం దెబ్బ ఏదో విధంగా తెలుస్తునేయుంది. పుట్టబోయే తరాల వారికి దీని ఫలితం బాగా తెలుస్తుంది. వైతొ లగి ప్రేక్షకునివలె ఎవ్వరూ చూస్తూ వూరుకో జాలరు. అభివృద్ధికి - తన్నిరోధానికి, నాగరిక తకు-పశుత్వానికి, జ్ఞానమునకు-మూఢత్వమునకు జరుగుచున్న యుద్ధం యిది.

ఇండియా - సింహళముల పూర్వ సాంప్ర దాయం, వేదాంతము కళలు జ్ఞానం ఎరింగిన వారెవరైన, యీ రెండు దేశాలు ఏ పక్షముం టాయో సందేహించెదరా?

కావున మీ విభేదాలను మరచిపోండి, అంద రు ఏకవ్యక్తిగ నిలచి మీ మిత్రులతో మిత్ర రాజ్యాలతో కలసి యుద్ధంలో చేరండి. మీ యిండ్లు, ఆస్తులు, విజ్ఞానం, భావి సంతతిని కాపాడుకొనుటకు యుద్ధం చేయండి. మనం పూర్తిగ స్పష్టంగా జయించిన పిమ్మటనే యీ ఘోర యుద్ధం ముగియగలదు. ఫాసిస్టుతత్వం, నాజీతత్వం, జపానువారి అధికార దుర్వాంఛ లను లోతయిన గొయ్యితీసి తిరిగి లేవకుండా, వేరొకసారి ప్రపంచాని క్షోభపెట్టుటకు వీలులే కుండా పాతేయాలి. ఆ గోయి త్రవ్వుటకు మనలో ఎందరెక్కువగా తోడ్పడితే ఎంత ఎక్కువ కష్టపడి త్రవ్వితే అంత త్వరగా ఆ పని ముగియగలదు.

ఈ మన సత్వరకార్యం పూర్తియైన పిమ్మట, మనకు అన్యోన్య సహాకారము సౌమ్యభావము అలవాటయి పోయినట్లు తెలుచుకోగలము. నూతన ప్రపంచాని, మన సంబంధాలను క్రొత్తగ సృష్టిం చుటకు, మన యీ సమిష్టి త్యాగంవలన కష్ట సమయాల్లో సహచర్యవలన యేర్పడిన సోదర భావంతో కలసి పనిచేయుటకు మన సంయుక్త రాజ్యాల ప్రజలకు కష్టముండదు.

ఇక శలవు, మీకందరికి మేలు కలుగుగాక."

# ద్వేషగీతం.

## గౌ॥ న్యా॥ వాడ్ఝువర్తుగారి రేడియో ఉపన్యాసం.

గౌ॥ న్యాయమూర్తి ఎస్. వాడ్ఝువర్తుగారు యిటీవల మదరాసు రేడియోద్వారా ఉపన్యసించిరి. అందు యిట్లు దెలిపిరి ;—

గత మహాయుద్ధంలో జర్మనులు తమ సైనికులకు ఇంగ్లాండుపై ద్వేషం ప్రకటించు పాట నొకటి నేర్పిరి. కారణమేమంటే జర్మను జాతివారికి పొరుగునవున్న ఫ్రెంచివారంటే ద్వేషంగలదు గాని, ఇంగ్లీషువారంటే సహజంగా స్నేహంగానే ఉండేవారు. కావున సైనికులకు ఇంగ్లీషువారంటే తీవ్రమయిన అసూయ కలిగించుట కొంత అవసరంగా నెంచి సర్వసేనాధిపతి, ఒక ద్వేషగీతం సృష్టించి నేర్పేడు. వారి దురదృష్టం కొద్ది ఇంగ్లీషు సిపాయి లాపాట నేర్చుకొని, వింతగ తోచి తామే ఆ పాట పాడసాగిరి. అందువలన జర్మను సైనికులు ట్రెంచీలలో దాగొనియుండగ, ఇంగ్లాండుపై ద్వేషం ప్రకటించు యీ పాట గట్టిగ పాడుచు సిపాయిలు చేరవచ్చుట గాంచి మోసపోయేవారు. వారిని చూచినపిదప ఇంగ్లీషు సిపాయిలు సరదా అయినవారిని, ద్వేషం ఎరుగక తమ పాటనే హాస్యంగా నెంచి ఆనందించు చున్నారని తెలుసుకొని అచ్చెరువొందిరి. ఆంగ్ల జాతికి ద్వేషం సహజగుణం కాదు. ఇరుగు పొరుగున ఉండుటచే రెండు జాతులవారికి తగవులు వచ్చి సరిపడక ఒకరినొకరు ద్వేషించు తుంటారు. ఆంగ్ల జాతివారు కేటాయింపుగ ఒక దీవిలో నివశించుటచేత యీ ద్వేషభావాన్ని అలవరచుకోలేదని నా యూహ. ఇండియాలో గూడ యిటువంటి సహనభావం కలదు. కాని దీనికి కారణాలు వేరు. వివిధ భారతీయ సంఘాలు ఒకదాని నంటక యింకొకటి యేర్పడి యున్నప్పటికి, వాటిలో వాటికి తగవులు వచ్చినా విదేశీయులంటే ద్వేషం లేకుండా చాల ఔదార్యం గానుంటవి. విదేశ విజ్ఞానమును, ప్రత్యేక జాతీయతను గౌరవింతురు. "వాడు విదేశీయుడు, తన్ను, పొడువు" అనే భావం ఇంగ్లీషువారి కెట్లా లేదో భారతీయులకుగూడ అట్లే లేదు.

ద్వేష కారణం.

అందుచే జర్మనులనుగాని, ఇటలీవారినిగాని, జపానీయులనుగాని వారి దేశాన్ని జాతిని బట్టి మనం ద్వేషించం. అయితే, ఆయా జాతులను నడిపించుచున్న పద్ధతులు చర్యల పట్ల అమితమగు ద్వేషం ప్రకటించుటకు వెనుదీయం. ఇంకో జాతివారు ఏ ప్రభుత్వం పద్ధతివల్ల పరిపాలింప బడుచున్నారో మనకెందుకు. వారు అంత ర్జాతీయ సంబంధములు చెడగొట్టకుండావుంటే అంతే చాలు. కాని ఒక పెద్ద జాతి తన సంపదనంతా వినియోగించి పెద్ద సైన్యాన్ని తయారు చేసి చేరువనుండు బలహీనులను బానిసలు చేయ దలచినపుడు, అదివరకున్న సంధిపత్రములు చెప్పకుండా చించేసి, తన అవసరాన్నిబట్టి అంతర్జాతీయ న్యాయశాస్త్రం ధర్మం మర్యాదలను త్రోసివేసి మోసం చేయడమే ఒక నేర్పుగ నెంచి, శాంతిగ నున్నట్లు నటించుచు ద్రోహం చేయునపుడు, ఆ దేశంయొక్క ప్రభుత్వ పద్ధతి, రాజకీయ శిక్షణలో యిట్టి చర్య లోక భాగంగా నున్నపుడు, ప్రపంచ నాగరికతకే మూలచ్ఛేదం ప్రాప్తించును. కనుక, అట్టి చర్యలను పూర్తిగ ద్వేషించి నిరోధింపక తప్పదు. తటస్థంగా నున్న అమాయకమగు హాలండుపై దాడిచేసి వేలకొలది ప్రజలను చంపిన జర్మనీ వైఖరితోటి, అమెరికాతో రాయబారాలు జరుపుచునే పెరల్ హార్బరుకు నౌకాదళం పంపిన జపాను వైఖరి తోటి, రాజీ పడడమన్నది యుండదు. సంధి పత్రాలకు, అంతర్జాతీయ ధర్మానికి తావులేనపుడు నాగరికతయే నిలువదు, తిరిగి ప్రపంచమంతా కోతుల యుగానికి పోవును.

జర్మనీ-జపాను పోరాడక తప్పదు.

అయినప్పటికి, మన నాగరికతకు వచ్చుచున్న యీ ముప్పును అహింసతో నెదుర్కోవాలనియు, మనబిడ్డలికముందేమవుతారోయను ఆలోచనలేక మన జీవితాలు బలియివ్వాలనియు చెప్పుచున్నారు. సక్రమ జీవిత విధానానికే ముప్పు వస్తున్నపుడు యీ నిర్నిరోధ సిద్ధాంతాన్నీ ఎట్లా హర్షించడమో తెలియకుండా యుంది. "ఇది అధర్మయుద్ధం నే నిందు పాల్గొనజాలను" అని చెప్పడానికి పూర్వకాలంలో అవకాశముండేదేమొ. కాని ప్రపంచ చరిత్రలో ఎక్కడా, యిపుడు జరుగు చున్నట్లు యింత స్పష్టంగా ధర్మానికి అధర్మానికి జరుగుచున్న యుద్ధం యింకోటి చూసియుండం.

ఇట్టి సందర్భంలో అధర్మం విజయం పొందితే యావద్మానవకోటికి వినాశ మేర్పడును. జర్మనులు జాపానువారు వారికి వీరికి స్వాతంత్ర్యం యిస్తామని చెప్పుచుండగా నమ్మేవా రెవరేనా వుంటారా యని ఆశ్చర్యం కలుగుతుంది. నిరంకుశపాలకులకు తమ ప్రజల స్వాతంత్ర్యము నందే నమ్మకం లేదు, తక్కువజాతుల స్వాతంత్ర్యాన్ని తను నమ్ముతారా? జర్మనులు యూరోపంతా వశపరచుకోవాలని, జపానువారు ఏషియా అంత వశపరచుకోవాలని ఆశిస్తున్నారు. చివరకు అక్షరాజ్యాలు గెలిస్తే ప్రపంచాధిపత్యానికి జర్మనీ-జపానులు యుద్ధం చేసుకుంటాయి.

అక్షరాజ్యాలలో అధికారం వహించిన దుర్మార్గులు తమ శత్రువులను హత్యజేయుటచే ఆ అధికారం సంపాదించిరి. కాని ఆ రాజ్యాలలో నున్న గౌరవనీయులగు ప్రజల అశ్రద్ధయు నిర్నిరోధభావమే, యీ చిన్న క్రూరవర్గాల కూటములు తమ జాతినంతా వశపరచుకొనుటకు అవకాశమిచ్చినవి. ఆ దేశాల యువజనులకు గూడ యీ పాపపు సిద్ధాంతాలు నేర్పబడుచున్నవి. హిట్లరు మతంలోనున్న గొప్ప దోషమే యిది. యువజనుల మనస్సులనుగూడ చెడగొట్టి, వారికి ద్వేషభావం అలవరచి, కొన్ని తరాలవరకు ఆ జాతిలో యీ చెడుబుద్ధులు పోకుండా చేస్తారు. ఒక నేరస్థుడు దాగున్నాడని అధికారులు అనుమానించి ఒక గ్రామమంతా నాశనంచేస్తూవుంటే తప్పుగా నెంచని యువకులు యువతుల మనోభావాన్ని ఏమనాలి? జర్మను సేన ఫ్రాంసుపై దాడిచేయుటకు పోవు దారిలోనుందను కారణమున తటస్థంగానున్న రాటరుడాం నగరంలో 30,000 ప్రజలను హత్య గావించుట తప్పుగా నెంచని వారి నేమి చేయాలి? యువకుల మనస్సులు చెడగొట్టి, వారికి నాగరికత వాసన లేకుండా చేయు పద్ధతిని రూపు మాపాలి. అంతర్జాతీయ సఖ్యతకు వేరు పురుగగు యీ పద్ధతిని ఎదిరించి నిర్మూలించువరకు రాజీ పడుటగాని, అహింసా జపంగాని యుండరాదు.

గత కొద్ది వారాలలో ఈజిప్టుకొరకు తీవ్రమగు యుద్ధం జరుగుచుండగా, ఈజిప్టు సైన్యం గూడ యితరులవలె దూరంగానుండి చూస్తూ, యిటీవల సంపాదించిన స్వాతంత్ర్యం కాపాడుకొనుటకు యుద్ధంలో పాల్గొనకుండుట మనకు వింతగ తోచెను. గత పక్షంలో జరిగిన యుద్ధ క్రమంవలన ఈజిప్టు స్వాతంత్ర్యానికి ముప్పు కలుగుచున్నది. తన నాగరికత తన రాజకీయ సంస్థలకొరకు యుద్ధం చేయనొల్లని జాతి ప్రత్యేక జాతి యను గౌరవమునకు తగియుండలేదని పెద్దలంటారు. మారణయంత్రాలు, మహాయంత్రాలతో తీవ్ర దాడులు జరుగుచున్న యీ రోజులలో నిర్నిరోధమంటే బానిసత్వం అంగీకరించుటే. మనం చస్తే చస్తాంగాని బానిసలుగా నుండం. అక్షరాజ్యాల ఆదర్శమగు పశుబలమును మనం పూర్తిగ ద్వేషించెదము. కనుక మనం చావుకు తెగించి పోరాడి, మన బిడ్డలు మనుమలు శాంతి సౌఖ్యములు న్యాయపాలనము అనుభవించుటకు తోడ్పడవలెను.

## కాందిశీకుల నెల భత్యాలు

### ప్రభుత్వంవారి యేర్పాటు.

శత్రు వాక్రమించిన దేశాలనుండి స్వదేశానికి వచ్చిన భారతీయులకును, అక్కడనుండి రాలేనివారిని ఆశ్రయించుకొని యీ దేశంలోనున్న కుటుంబాలకును నెల భత్యాలిచ్చుటకు ప్రభుత్వం వారు ఏర్పాటుచేసేరు. అవి తిరిగి వాపసు యిచ్చే షరతుపై ఒసంగబడుచున్నవి. ఎవరికెంత అలవెన్సు యివ్వవచ్చునో రాష్ట్రీయ ప్రభుత్వాధికారులు నిర్ణయింతురు. అలవెన్సులకొరకు దరఖాస్తులు జిల్లా అధికారులకు పంపవలెను, ఇచ్చే అలవెన్సుల గరిష్ఠ నిర్ణయం యిట్లు విధించబడెను :—

| కాందిశీకుల రాబడి లేక కుటుంబాలకు వచ్చే మనియార్డరు అంచనా. | ప్రతి ఒక ఆర్జనపరుడు లేక మనియార్డరు పుచ్చుకొనే పెద్ద వ్యక్తికి. | భార్య, లేక యింకో ఆశ్రితుడు పెద్దవాడు వుంటే వారికి. | బిడ్డకు. |
|---|---|---|---|
| 0—50 | 15 | 25 | 5 |
| 51—150 | 30 | 50 | 8 |
| 151—400 | 60 | 100 | 12 |
| 401—750 | 100 | 170 | 16 |
| 750 పైన | 150 | 250 | 20 |

ఒకే ఆర్జనపరునిపై ఆధారపడియున్న వారందరికి వారి రాబడి మొత్తం అంచనాలో నూటికి 75 వంతు మించకుండా ఒసంగబడునట్లు యీ రేట్లు నిర్ణయించబడెను. అదియు నెలకు 350

# యుద్ధ పరిశ్రమల రక్షణ.

## దేశాన్ని కాపాడుటకు అత్యంత అవసరం.

### ఇండియాలో కర్మాగారాల రక్షించు ఎ.ఆర్.పి. యేర్పాటులు.

శత్రు దేశాలలో యుద్ధ పరిశ్రమలను నాశనంచేయుటకు, కర్మాగారాలు, మిల్లులు, చమురు తటాకాలు మున్నగునవి నాశనంచేసే ఉద్దేశంతో విమానదాడులు జరుగుతాయి, కనుక అట్టి పరిశ్రమలను విమానదాడినుండి రక్షించుటకు తగు యేర్పాటులు చేయుటగూడ, దేశ రక్షణకు చాల అవసరం. ఇంగ్లాండులో యీ యేర్పాటులు చాల బాగున్నందున విమానదాడివలన ఉత్పత్తికి నష్టం చాల తక్కువయుండెను.

ఇండియాలో ముఖ్యమయిన కర్మాగారములన్నింటికి రక్షణ కొరకు ఎ.ఆర్.పి. ఏర్పాట్లు కేంద్ర ప్రభుత్వంవారి కార్మికశాఖ బాధ్యతయందున్నవి. కార్మికుల రక్షణకు, వస్తువుల ఉత్పత్తి నిలచిపోకుండుటకు, యంత్రాలకు నష్టం కలిగినచో వీలయినంత త్వరలో తిరిగి ఉత్పత్తి యగుటకు తగు యేర్పాటులు చేయుటకును యెట్టి చర్యలైన గైకొనుటకు ఇండియా రక్షణ నిబంధనల ప్రకారం ఫాక్టరీ ఎ.ఆర్.పి. చీఫ్ అడ్వైజరుకి చాల అధికారములు గలవు. పనివారికి గాయాలు తగలకుండా ప్రమాదంలో చనిపోకుండా రక్షించాలి. ప్రతి కర్మాగారంలో తగు రక్షణ గుహలు, ఎ.ఆర్.పి. శిబ్బంది, మంటలార్పు దళములు శిక్షణపొందిన వారుండాలి.

### ఆహారాది సౌకర్యములు.

కార్మిక శ్రేయంగూర్చిన ప్రభుత్వ సలహాదారు ఆర్. ఎస్. నింబుకరుగారి సహాయంతోగూడ సాధారణపు ఆహార పదార్థాల సరఫరాగాని, రవానా సౌకర్యాలుగాని చెడిపోయినపుడు ఆహారాదుల సరఫరాకు తగు యేర్పాటులు చేయబడుచున్నవి.

అంతేకాక, భవనాలు, యంత్రాలు, పరికరాలు బాంబు తునకల తాకిడికి, అగ్నివలన భూమి కదలికవలన చెడిపోకుండా రక్షణలు ఏర్పాటుచేయబడెను. ఎలక్ట్రికు సబు స్టేషనులు, ట్రాంసుఫార్మర్సు, మెయినులు యిటువంటి ముఖ్య యంత్రాల విషయమున ప్రత్యేక శ్రద్ధవహించబడెను. అన్ని ఫ్యాక్టరీలలో మంటలార్పుటకు ఎక్కువగ నీరు నిలువాయుంచబడెను.

ఎ.ఆర్.పి. చీఫ్ అడ్వైజరుగ ఇంగ్లాండులో విమానదాడి రక్షణ యేర్పాటులయందు అనుభవంగల గార్డను పీసుగారు నియమింపబడిరి. యుద్ధం ఆరంభంనుండి యీ పనులయందు నిమగ్నులై ఇంగ్లాండులో పనిచేయుచుండిన చీఫ్ ఇన్‌స్పెక్టరు బ్రిగాడియరు పి. డబ్ల్యు. ఎల్. బ్రూకు స్మితుగారు ఐదు నెలల క్రిందట ఇండియాకువచ్చి తన అనుభవజ్ఞానమును ఇచటి ఉద్యోగులకు తెల్పుచున్నారు. ఇంగ్లాండులో సప్లై మంత్రి కార్యాలయంలో పనిచేసిన మరో ఐదుగురు ఉద్యోగులు నిపుణులు చీఫ్ అడ్వైజరుగారికి తోడ్పడుటకు నియమింపబడిరి. వారు అచట విమానదాడులు, మెరుపు యుద్ధం జరుగుచుండగ పనిచేసిరి.

### భారతీయోద్యోగులకు శిక్షణ.

ముగ్గురు భారతీయోద్యోగులు, టాంబి, కలపేశి, వాహిడీగార్లు అపుడే ఇంగ్లాండు పంపబడిరి. వారు అచట ఫ్యాక్టరీలలో జరుగుచున్న ఎ.ఆర్.పి. యేర్పాటులనుచూచి శిక్షణ పొందివత్తురు. మరి యిద్దరుకూడ త్వరలో ఇంగ్లాండుకి పంపబడుదురు. తిరిగిరాగానే వారు ఎ.ఆర్.పి. సంస్థలో చేర్చుకొనబడుదురు.

ఇండియాలో శత్రు దాడి అవకాశంగల ఫ్యాక్టరీలన్నింటిని యిటీవల తణికీచేసిచూడగ, తగు రక్షణ యేర్పాటులన్నియు త్వరగ పూర్తి చేయబడుచున్నవని తెలిసెను.

---

మించకుండా, ఏ సంఖ్య తక్కువైతే అది ఒసంగబడును. ఈ రేట్లు 1942 వ సం॥ జూలై 1 వ తేదీనుండి ఆరు నెలలవరకు అమలునందుండును. పిల్లలు స్కూలుకిపోయి చదువుకొనుచున్నారని రుజువయినచో రాష్ట్రీయాధికారులు బిడ్డలకు అలవెన్సులు యివ్వవచ్చును. ప్రతివాని విషయం నెలనెలకు విచారించి, వారికి పని దొరికిందో లేదో రూఢి చేసుకొని భత్యం యివ్వబడును.



బ్రిటిషు నౌకాదళ సైనికులు 6 అడుగుల ట్రెంచి దాటుట.

# యుద్ధ విమర్శ.

## ఈజిప్టు యుద్ధరంగం—పరిస్థితులు మారుట—
## భారతీయ సేనల ఘనత—శత్రు రేడియోల ప్రచార ఖండనము.

ఈజిప్టు రంగం : రాయలు విమాన దాడి.

ఈజిప్టు యుద్ధరంగమునందు సైనిక చర్యలు యించుక మందగించినట్లుంది. రెండుపక్షాలవారు ఆఖరు యుద్ధానికి దిగుటకు తయారగుచున్నారు. సిడిబరాని తీరమునందు శత్రువులకు సరకు తెస్తున్న చిన్న పడవలపై రాయలు విమానాలు దాడిచేయుటబట్టి శత్రువుకి పెద్ద నౌకలు పోయి చిన్న నౌకలనుగూడ యీ పనికి ఉపయోగించుకోవలసి వచ్చిందని తెలియగలదు. అందు రెండు బార్జీలు కాల్చివేయబడినవి. ఒక టాంకరునుండి పొగలు కనబడినవి. బ్రిటిషువారికేమి నష్టం కలుగలేదు.

నేల సైన్యాలలోనున్న మాంద్యం విమానాలలో అగుపడదు. మిత్రమండలి విమానాలు చాలపోయి ఫూకాయందు నాల్గు విమాన మైదానాలపై బాంబులు వేసినవి. 30 శత్రు విమానాలు నష్టపోయినవి. 250 పౌనుల బరువుగల ఒక బాంబు వేయడంవలన, అది 550 గజాల వలయావరణ యంతటికి త్రుళ్లి నష్టపెట్టును గనుక, నేలనున్న శత్రు విమానం ఒకటైన తప్పించుకొనియుండదనే ఎంచవచ్చును.

నౌకాదళం దాడి.

మెర్సామట్రు రేవుపై సోమవారం బ్రిటిషు నౌకాదళం దాడిచేయుటచేత, హార్బరులోనున్న శత్రు నౌకలు, కట్టడములు నాశనమయినవి. అక్షరాజ్యాల ప్రధాన సప్లయి కేంద్రమగు యీస్థలంపై యింత తీవ్రమయినదాడి యిదివరకు జరుగలేదు. భవనాలు ఆకాశం ఎత్తున కెగరినవి. శత్రు నౌకలపై 400 గుండ్లు ప్రేలినవి. మన విమానాలకు నిరోధంకూడ ఎక్కువుండెను కాని దాన్ని లక్ష్యంచేయం, తిరిగి ప్రతిరాత్రి వెళ్లి యిట్లే చేయగలమని, యీ దాడిలో పాల్గొనిన ఉద్యోగి ఒకడనెను.

బ్రిటిషువారిదే పైచేయి.

గత పక్షందినాలలో ఈజిప్టు యుద్ధరంగమున బ్రిటిషువారిదే పైచేయిగానుంది. అలగ్జాండ్రియావరకు త్రోసుకపోవుటకు తనకున్న శక్తినంతా తెగించి వినియోగించుటా, లేక మన

దాడి కందకుండా ఎక్కడైన భద్రమగు స్థలానికి పోయి దాగొనుటా యని జర్మని సేనాని రోమెలు ఆలోచిస్తు వుండవచ్చును. విధిలేక మన బల వంతాన తప్ప అతడు పడమరకుపోడు. తన శక్తినంతా యీ దాడిలోనే వినియోగించుటకే ప్రయత్నించును. తన పంజారు (టాంకు) డివిజనులు, పూర్తిగ లేకున్నప్పటికి, మన ఎనిమిదవ సైన్యాన్ని పారద్రోలి ఈజిప్టునంతా వశ పరచుకోగలవనియు, 8 వ సైన్యం నిలచిపోరినా తన ఆయుధాధిక్యతకు లొంగిపోవుననియు, సకాలంలో దానికి సహాయంగా అధికసైన్యం రాదనియు అతడు ఆశించెను. కాని అట్లు జరుగ లేదు.

* * *

స్థితి మారుట : 4,000 ఖైదీలు.

టొబ్రుకు పతనంగూర్చి నిర్ధారణగ తీర్పుచెప్పుటకు యింకావివరాలు పూర్తిగ తెలియలేదు. కాని శత్రువుని తప్పించుకొంటూ ఈజిప్టులోనికి మన సేనలు పారివచ్చుట గొప్ప సైనిక వ్యూహం అనిపించుకుంటుంది. జనరలు ఆకింలేకు సేనాని అతని సహోద్యోగులు ఓర్పుతో నేర్పుతో యీపనిచేసి, గొప్ప ప్రమాదాన్ని తప్పించిరి.

ఎల్అలామీనువద్ద తీవ్రయుద్ధం వెంటనే ప్రారంభమయింది. అకింలేకుగారు శత్రువుపై తిరుగుదాడులు ప్రారంభించి శిక్షించుచుండెను. అతనికి న్యూజిలండు సేనయు, యితర సేనలు, బ్రిటిషు టాంకులు, 25 పౌండరు ఫిరంగిదళము సహాయంగా వచ్చెను. ఒక వారం యుద్ధం జరిగినపిమ్మట రోమెలుగారు తన యుద్ధరంగమును సేన విస్తీర్ణమును తగ్గించుకొనవలసివచ్చెను. ఎల్అలామీనునకు పడమర కొన్ని మైళ్లలో తీరం దగ్గర, ఒక తావునుండి దక్షిణాన్న 25 మైళ్ల పొడవువరకును, అటనుండి వెనుకకు ప్రక్కకాపుగ 30 మైళ్లవరకును అతని సేనలు నిలచి యున్నవి. తన సైన్యాల సప్లయి మార్గాలకు బ్రిటిషు సేనల దాడి కలుగకుండా రక్షణకు యిట్లు చేసెను. పరిస్థితులు మారుచున్నవనుటకు యిదే గుర్తు. ముందుకుపోయి ఎదుటి సేనలను అన్ని వైపులనుండి చుట్టివేయజూచు సేనాని యెవ్వడు తన సేనను వెనుక 30 మైళ్లవరకు పోనివ్వడు. 10 వ తేది ఉదయం మిత్రమండలి సేనలు ఎల్అలామిను పడమర 6 మైళ్లవరకు చొచ్చుకపోయి, టెలుఎల్ఏయిసావద్ద 2,000 అక్షరాజ్య సైనికులను ఖైదీలుగ పట్టుకొని, అనేక శత్రు టాంకులను నాశనంచేసినవి. 4,000 మంది ఖైదీలు జూలై 14 తరువాత పట్టుపడిరి.

ఇంతమాత్రమున మిత్రమండలి తిరుగుదాడుల విజయం ప్రారంభమయిందని, ఈజిప్టులో ప్రధాన యుద్ధ పరిస్థితులు తిరుగుముఖం వేసినవనియు యెంచుటకు యిపుడపుడే వీలులేదు. ఇది ఒక్కచోట శత్రువును శిక్షించుటకు, వారి పురోగమనం అణచుటకు చేసిన యత్నము. ముందు యుద్ధాల విజయాలు ఉభయపక్షాలకు రాగల క్రొత్త సైన్యాల సహాయం ఎంతో దాన్నిబట్టి యుండును. రాయలు విమానదళంవారు అమెరికా, ఆస్ట్రేలియా దక్షణాఫ్రికా వైమానికుల సహాయంతో నేల సైన్యానికి చాలబాగ తోడ్పడిరి. మున్ముందు యుద్ధం ఫలితం తేల్చుటకు యిదెంతయు తోడ్పడగలదు. శత్రువుయొక్క సప్లయి మార్గాలు చెడగొట్టుటకు, బెంగాజీ ట్రిపోలీలపై తీవ్ర విమానదాడులు జరిగినవి. వారి మోటారు రవానా బండ్లు, సప్లయి డిపోలు చాల నాశనంచేయబడినవి. ఇది గొప్పవిజయమే, కాని శత్రువు నైలుడెల్టాకు చాల చేరువలోనే యింకా యుండబట్టి, క్రీటులో విమానాలపై వచ్చిన సేనలు గుమిగూడియున్నందునను, అకినులెకుగారి సేనను వెనుకనుండి కొట్టుటకు మంచి తరుణమునకు వేచియున్నాడు. మిత్రమండలి సేనలు శత్రువును యిపుడెక్కడున్నాడో అక్కడనే ఉంచగల్గినచో త్వరలో వెనుకకు తరిమివేయగలవని ఆశింపవచ్చును.

* * *

ఈ మహాయుద్ధంలో ఇండియా సైన్యాలు చాల ఘనమగు కార్యం చేయుచున్నవి. వారిదళములు దక్షిణరంగమున శత్రువును ఇండియా సైన్యం ప్రక్కనుండి చీకాకుచేయుటేగాక, మధ్యభాగమున రువిసటు కొండవద్దగూడ యుద్ధంలో పోరుచున్నవి. ఆదివారంనాడు ఈ కొండకు పడమరకు కొంతదూరం ఇండియను సేనలు దాడి వెడలినవి. శత్రు టాంకులతోను, కాల్బలంతోను తిరుగుదాడులు జరిపినవి. కాని భారతీయ సైనికులు బలవత్తరంగా నిరోధించి శత్రువును చాల నష్టం కలిగించి వెనుకకు తరిమిరి. భారతీయులు, ఆస్ట్రేలియనులు, దక్షిణాఫ్రికా సైనికులు యిపుడు తీరంనుండి మధ్యరంగంవరకు

తైనాతూ కాపలా కాస్తున్నారు. 16 వ తేదీ రాత్రి సాయుధ మోటారుదళం (బ్రిగేడు) ఒకటి భారతీయ సేనను స్థానం తప్పించుటకు శత్రువు చేసిన యత్నమును విఫలమొనరించెను. 10 శత్రు టాంకులు పూర్తిగ నాశనంచేయబడినవి. 13 టాంకులు, 6 కవచపు మోటారులు, 1 తుపాను ఫిరంగి, 5 టాంకు విధ్వంసక ఫిరంగులు, మరో 37 ఎం. ఎం. ఫిరంగులు 14 అంతకన్న పెద్ద ఫిరంగులు ప్రేల్చివేయబడినవి. శత్రువుల కీనష్టం అంతా 90 నిముసాలు జరిగిన యుద్ధ ఫలితం. "ఈజిప్టులో మంచి ధైర్యోత్సాహం, దాడి అంటే అభిలాషగల సైన్యం గలదు. కాని అంతా ఆనందంగా వుందనుకోకండి. ఈజిప్టు యుద్ధంలో ప్రధానఘట్టం యింకా రానున్నది" అని ఒక విలేఖరి వ్రాసెను. అది వచ్చుసరికి మిత్రమిండలి సేనలు సిద్ధంగానుంటాయి.

* * *

ఇండియాగూర్చి అక్షరాజ్యాల ప్రచారము.

బ్రిటిషు కార్మికపక్షం కార్యవర్గంవారు యీ వారం భారతీయ ప్రజలు బ్రిటిషు ప్రభుత్వంతో రాజీ పడాలని కోరుచు - తీర్మానించెను. భారతీయుల స్వపరిపాలన వాంఛయందు తమ కిష్టమేననియు, వారి శ్రేయోభివృద్ధినే తాము కోరుచున్నామనియు, ఇండియాలో జరుగనున్న కొన్ని వ్యవహారములు సంయుక్త రాజ్యాలు జరుపుచున్న ప్రపంచ స్వాతంత్ర్య కృషికి భంగం కలుగునను భయమును ఆ తీర్మానంలో సూచింపబడెను. ప్రజా ప్రతినిధి ప్రభుత్వ విరోధులగు రాజ్యాలవారు అనగా ఇటలీ, జర్మనీ, జపానులు ఇండియాలోని పరిస్థితులను అవకాశంగా తీసుకొని తమ దుష్టప్రచారం ప్రారంభించిరి. సర్ స్టాఫర్డు క్రిప్సుగారు ఇండియాకు పోనున్నారని ప్రకటింపబడగానే బెర్లిను, టోకియో రోము రేడియోలు అసత్య ప్రచారం ప్రారంభించి, ఇండియాయొక్క రాజకీయాదర్శము లీడేరకుండ ఆటంకపరుచుటకు పూనుకొన్నవి. అతడేమి సూచనలు భారతీయులకు చేసేనో అవి సరిగా ఆ రేడియోలు ప్రకటించనేలేదు. వాటితో వారికి ప్రసక్తిలేదు. క్రిప్సుగారికి భారతీయులకు రాజీ కుదురక పోవడమే వారికి కావాలి. క్రిప్సు కార్యం విఫలంకాగానే బెర్లిను తన విజయంగా ప్రకటించెను; జపాను తన నౌకాదళం హిందూ మహాసముద్రంలో నుండబట్టే యిట్టి ఫలితం చేకూరిందనెను. తరవాత సుభాస చంద్రబోసు చనిపోయినాడని జర్మనీ ప్రకటించి, అది అసత్యమని వెనుక తెలిపెను. ఇందువలన భారతీయ నాయకులకు మనక్లేశం కలిగించి, వారి అభిప్రాయాలు మార్చివేయుటకు జర్మనీ ఉద్దేశించెను.

కార్కోవు ప్రాంతాల జర్మను దాడి మార్షలుటిమెషంకో రష్యను సేనలవలన నిరోధించబడినపుడు మే 27 వ తేదిన లిబియాలో దాడి ప్రారంభమయింది. రోమెలు సూయజుకాల్వ వరకు త్వరగా త్రోసుక పోజూచెను. మే 30 వ తేదిన జపాను పత్రిక బెర్లిను విలేఖరి యిట్లు వ్రాసెను :—

> "సుభాస చంద్రబోసు జర్మనీలో చాలకాలంనుండి యున్నాడని యిక్కడి అంతరంగికులకు తెలిసెను. బోసుగారిని ముసోలినీ, హిట్లరు లిద్దరు సన్మానించిరి. అనగా బోసుగారింక అజ్ఞాతవాసంలో లేరన్నమాట. అధికార రీత్యా వారి ఉనికిని అక్షరాజ్యాలు గుర్తించినవి కనుక, ఇండియాపై మొదటి దెబ్బతీయుటకు యిదే మంచి సమయమని జర్మనీ, ఇటలీలు తలంచుచున్న వన్న మాట.
> —కాటో."

అంతకు రెండు రోజులు ముందు (మే 28) బెర్లినులోనున్న కృత్రిమ 'అజదు హిందు' రేడియోద్వారా, జపాను బర్మాను ఆక్రమించిన పిమ్మట ఇండియా తూర్పు సరిహద్దు యేమగునో జర్మనీ అభిప్రాయం యీ దిగువ రీతిగ వెలువడెను :—

> "జపాను దాడి బెంగాలుపై నుండక తప్పదు. కావున జపానీయులు దాడివస్తే వారికి తోడ్పడుటకు బెంగాలీలు ఒక సంఘంగా నేర్పడవలెను. మహాత్మ గాంధిగారు యిటీవల హరిజన వ్యాసములలో వ్యక్తపరచుచున్న వైఖరి మాకు ఆనందం కలిగించుచున్నది"

క్రిప్సు రాయభారం విఫలమగుటతోను ఇండియాలో రాజకీయ పరిస్థితులు అస్థిరంగా నుండుటతో మాత్రం అక్షరాజ్యాలు సంతృప్తి చెందలేదు. తన ప్రచారంలో వాగ్దానాలతోపాటు బెదరింపులు కలిపి, ఇండియా - ఇంగ్లండులకు ఎటువంటి ఒడంబడిక కుదిరినా అక్షరాజ్యాలకు ప్రతికూలంగా నెంచబడునని స్పష్టంగా తెలిపెను. బ్రిటిషు ప్రభుత్వం తిరిగి క్రొత్త సూచనలుగూడ చేయునని జర్మనీ తలచుచున్నది. అవి ఇండియా నిరాకరించుననిగూడ తెలుపుచున్నది. అజదు హిందు రేడియోనుండి జూలై 13 వ తేదీ అరవంలో యిట్లు ప్రసారం చేయబడెను :—

> "ఈ సూచనలు బ్రిటిషువారి యుద్ధ ప్రయత్నాలకు తోడ్పడుటకు ఉపయోగపడును. అట్టి సూచన

లను పూర్తిగ నిరాకరించండి, ఏమన, అవి ఇండియాకు లాభకరం కావు ''

కాని, ఇండియాకు ఇంగ్లాండు స్వాతంత్ర్యం వాగ్దానం చేసిందని అక్షరాజ్యాలకు తెలుసు. ఆ వాగ్దానంలో ఒకటే షరతు కలదు : ముందు విజయం చేకూరి, అందువలన యిపుడు ఇండియాకుగల దాడి ప్రమాదం తొలగించుకోవాలి. ఈ వాగ్దానం అక్షరాజ్యాలకు భీతి కలిగించెను, ఇండియాలో దౌర్జన్యయుతమగు అరాచకం కలిగించాలని వారు కోరిరి. పైగా ఇండియాలో రాజకీయ అస్థిరత తాము తలపెట్టిన కార్యాలకు తోడ్పడునని వారి ఆశ.

అక్ష రాజ్యాల దురుద్దేశం.

ఇండియాలో స్వాతంత్ర్యోద్యమం వెంటనే ప్రారంభం కావాలని అక్షరాజ్యాలు ఎందుకు కోరుచున్నవి ? టోకియో రేడియోలోనే దీనికి కారణం తెలుపబడెను :—

'' ఇట్టి ఉద్యమం ఇంగ్లాండును బలహీన మొనర్చుటయే గాక, అమెరికా, చుంగుకింగు (చీనా) లనుగూడ బలహీన మొనరించును. '' అని టోకియో రేడియోలో జూలై 18 వ తేదీన తెలుపబడెను.

కావున ఇండియాయడల జపాను ఔదార్యం చూపుట, నిజంగా తన సైనికోద్దేశం నెరవేర్చుకొనుటకే ఉద్దేశింపబడినదని స్పష్టమగుచున్నది.

ఇంగ్లాండు-అమెరికాలు చేయుచున్న సహాయం రాకుండా చేయుటయు, చీనాను పూర్తిగ తనకు బానిస చేసుకొనుటయు జపాను వుద్దేశం.

జపాను సందిగ్ధావస్థ.

జపాను సందిగ్ధావస్థలోనుంది. తన ముఖ్య శత్రువులను ఓడించలేక పోయెను. రానున్న రెండు మూడు నెలలలో నేమిచేయాలో తెలియదు. మంచూరియా సైబేరియాల మీదుగా రష్యాపై దాడిచేసి జర్మనీతో చేయి కలుపునా ? లేక ఆఫ్రికాప్రాంతాలలో అక్షరాజ్యాల దాడి ననుసరించి వాటికి సహాయంగా యివతల ఇండియాపై దాడిచేయునా ? ఇండియాలో ప్రజల మనస్సులను కలవరపరచి దేశరక్షణ కార్యాలకు నిరోధం కలిగించుటకు శత్రురాజ్యాలు మూడున్ను తీవ్ర ప్రచారం చేయుచున్నవి. ఈ ప్రచారం యొక్క ఫలితం కొరకు జపాను వేచియుండి శ్రద్ధగ గమనించుచున్నదని అధికారులకు వచ్చిన సమాచారంపట్టి తెలియుచున్నది. ఢిల్లీలో పరిపాలనా విధానం కొన్నాళ్లు స్థంభించాలని, అరాచకాలు విపులంగా జరగాలని జపాను వాంఛించుచున్నది. సైనికదాడి తరువాత ఎక్కడ చేయాలను నిర్ణయం, బహుశః యీ చర్యలపై నాధారపడియుండును.

---

# జపానుకు సైబీరియా జ్వరం.

యుద్ధం అనేది సవారీ బండి మాదిరిగా చక్కని కంకరరోడ్డు తారురోడ్డు ఉన్నంతసేపూ సాగినంతసేపూ అతివేగంగా, వాయువేగంగా సాగుతుంది. ఆ వేగంతో పరుగెత్తలేనప్పుడు మెల్లగా నడుస్తుంది. మెల్లగానైనా సాగుతూ వుండుటకు వీలులేనప్పుడు, బురదలో దిగబడిన బండీలాగున స్తంభిస్తుంది. లేదా ఒక్కొక్కప్పుడు బండీని ఇక లాగలేక ఎద్దులు మొండిగా పడుకుంటాయి, కాలు తీసి కాలు పెట్టలేని స్థితి వచ్చినప్పుడు, ముందంజ వేయలేక కదలక మెదలక పడుకుంటాయి. బండిలో ఎక్కించిన బరువు ఎక్కువైనప్పుడుకూడా బండి ముందుకు సాగదు. వెనుక బరువు ఎక్కువైనప్పుడు ముందున్న కాడి తేలిపోతూవుంటుంది. అటువంటి సందర్భంలోకూడా ఎద్దులు బండిని లాగలేవు.

యుద్ధం అనే బండికూడా యిదేవిధంగా సాగుతూ వుంటుంది. జపానువాళ్ల యుద్ధం నమోనాకు చూడండి. చైనాలో జపానువాళ్లు అయిదు సంవత్సరాలనుంచీ యుద్ధంచేస్తున్నారు. ఇంతవరకూ అది అంతులేకుండా ఉంది. ఒక రేవుకు వచ్చి గట్టెక్కలేదు. చైనాలో అయిదేళ్లు యుద్ధంచేసి అయిదు పరగణాలైనా ఆక్రమింపగలిగినారో లేదో అదికూడా అనుమానమే. అంతట ఆ చైనా రోడ్డుమీద బండి సాగక, ఇటు సింగపూరుమీదకు బర్మామీదకు దండయాత్ర సాగించారు. డచ్చి యీస్టు యిండీసు దీవులమీదకు యుద్ధం సాగించారు. ఇక్కడ వారి యుద్ధ రథం వేగంగా నడిపించారు. అమెరికావారి ఫిలిప్పయిను దీవులను ఆక్రమించడం వెంటనే అనుకున్నంత వడిగా జరుగలేదు. అక్కడ బండి తిరిగి బురదలో దిగబడిన చక్రం

లాగున అయింది. ఆ బురదలోనుంచి బండిని బయటకు లాగేటప్పటికి, జపానువాళ్లకు కృత్యాద్యవస్థ అయింది. ఆస్ట్రేలియామీదకు దండెత్తవలెనని పెద్ద యుద్ధ నావల ముఠాతో వచ్చారు. కాని, కోరలు సముద్రంలో అమెరికను నావలతో యుద్ధంచేసి, జపాను నౌకాబలం చాలా దెబ్బ తిన్నది. అంతటితో ఇక ఇక్కడ యుద్ధం చేస్తే ప్రయోజనంలేదని భావించి, కాలికి బుద్ధి చెప్పి, "మాధవా మన రథంబు మరల నిమ్ము!" అన్నట్లుగా, తోక ముడతబెట్టి వెనుకకు వెళ్లారు.

అప్పటినుంచీ జపానువాళ్లు ఇప్పటివరకూ ఏమి చేస్తున్నారయ్యా అంటే, తిరిగి చైనాలోనే పాత పోరాటం మళ్ల సాగిస్తున్నారు. చైనాలోని తూర్పు కోస్తాలోని చికియాంగు పరగణాలో యుద్ధం చేస్తున్నారని కొన్నాళ్లు వార్తలువచ్చాయి. కియాంగ్సీ పరగణాలో యుద్ధం చేస్తున్నారని మరికొన్ని దినాలు వార్తలు వచ్చాయి. రష్యాకు చైనాకు సరిహద్దులలోవున్న చైనాలోని సూయియాను పరగణాలో యుద్ధం చేస్తున్నారని కొన్నాళ్లు వార్తలు వచ్చాయి. చైనా ప్రభుత్వం ప్రస్తుతం చుంకింగు నగరంలో ఉన్నది. ఈ చుంకింగునగరం కోస్తాకు చాలా దూరంగా దేశగర్భంలో ఉంది. చైనాలోని అనేక పరగణాలు చొచ్చుకొని, అనేక పరగణాలు ఒక్కటొక్కటిగా ఆక్రమించి దేశ మధ్యంలోనికి చొరబడితే తప్ప చుంకింగును పట్టుకొనుటకు సాధ్యం కాదు.

చైనాలోని యీ పరగణాలన్నీ జపానువారు యీ లెక్కను జయించుకొనిరావలెనంటే, కొన్ని సంవత్సరాల కాలం పట్టుతుంది. అదిన్నీగాక చైనా దేశంలోనికి బయటనుంచి ఆయుధాలు వగైరా సప్లయిలు రాకుండా చైనానుంచి బయటికి పోయే మార్గములను బంధించవలెనని జపానువాళ్లు ప్రయత్నించారు, బర్మా-చైనా రోడ్డు బంధించారు. అదిపోతే, ఇండియా-చైనా రోడ్డు ఇంకొకటి సిద్ధమైంది. ఇప్పుడు ఇండియాలోని వాయవ్యభాగంలో పెషావరుమీదుగా సింకియాంగునుండి చైనాలో కున్సూ పరగణాలోనికి ఇంకొక త్రోవ ఏర్పడింది. ఇదిగాక రష్యాలోనుంచి సూయియాను పరగణాలోనికి యింకొక త్రోవ ఉన్నది. ఈ త్రోవలన్నీ మూసివేయడంకూడా చాలా అసాధ్యమైన పనిగా ఉంది. చైనాదేశం యావత్తూ బ్రహ్మాండమైన పర్వత పంక్తులతో నిండి ఉంది. బ్రహ్మాండమైన నదులు ఎక్కడ చూచినా మార్గానికి అడ్డంగా లెక్కకు మిక్కిలిగా ప్రవహిస్తున్నాయి. రైలు మార్గములు ఏవో కొన్ని లెక్కించడానికి వీలుగా ఉన్నవి గాని, దేశమంతా అందుబాటులో ఉండేటట్లుగా అవి విరివిగా విస్తరించలేవు. కనుక, యీ పర్వతశ్రేణులను దాటి యీ నదీ ప్రవాహమును దాటి, ఘోరారణ్యములలో యుద్ధంచేస్తూ ఒక్కొక్క పరగణా ఆక్రమించడం జపానువారికి సాధ్యమయ్యే పనిగా లేదు. అదిన్నీగాక, చైనా జాతివాళ్లు చాలా మొండిపట్టుదలకలవాళ్లు. రక్తం ప్రవహిస్తున్నా సరే, ప్రాణం పోతున్నా సరే, శత్రువును విడిచిపెట్టరు.

పై కారణాలవల్ల జపానువాళ్ల యుద్ధ రంగం అయిదేళ్లనుంచీ చైనాతో సాగడంలేదు. అదిన్నిగాక, ఇది ఇట్లుండగా జపానువాళ్ల కొక క్రొత్త కలవరింత యొకటి యిప్పుడు ప్రారంభమైంది. జపానుకు చేరువలోనున్న రష్యాయొక్క కోస్తా ప్రాంతమును తాము ఆక్రమించకపోయినట్లయితే ఆ కోస్తా ప్రాంతముమీదకు అమెరికా విమానాలువచ్చి ఆశ్రయ మేర్పరచుకొని, చేరువలోని జపానుమీద బాంబులువేసి, జపానును ధ్వంసం చేయగలవు. కనుక, రష్యాలోని సైబీరియాను తాము ఆక్రమించవలెననే సంకల్పం జపానుకు కలిగింది. సైబీరియా కావలెననే అపరిమిత దాహం జపానుకు కలిగింది. అందుకొరకై రష్యాతో యుద్ధం చెయ్యవలసియున్నది. కాని రష్యా అనేది బ్రహ్మాండమైన దేశం. రష్యాతో యుద్ధం జపానువంటి చిన్న రాజ్యం చెయ్యగలదా? అదేసమయంలో చైనాకూడా వెనుకవైపునుంచి జపానును మరింత ఒత్తిడిచేస్తుంది. అప్పుడు రష్యాతోను, చైనాతోను ఏకకాలమందు జపాను యుద్ధం చెయ్యగలదా? ఇదే జపానువాళ్లకు గల భయం. కాని, సైబీరియాపై దండెత్తవలెననే దురాశ జపానుకు బాగా కలిగింది. ఇది ఒక వ్యాధిలాగున జపానువారికి ప్రవేశించింది. మలేరియా జ్వరంలాగున వారిని ఈ దురాశ పీడిస్తోంది. మలేరియా జ్వరానికి చేదు క్వయినామాత్ర బాగా పనిచేస్తుంది. అదేవిధంగా జపానుకు కలిగిన యీ సైబీరియా జ్వరానికి చైనా మాత్రలు బాగా పనిచేయగలవు. సైబీరియా

మీదకు దండెత్తిన సమయంలోనే జపాను సేనలను చైనావారు హతము చేయగలరు. చైనాలోని పరగణాలన్నియు జపానువారికి చేదు చైనామాత్రలవలె పనిచేసి సైబీరియామీద కలిగిన దురాశా జ్వరమును పూర్తిగా తొలగించి జపానుకు బుద్ధి కలిగేటట్లు చేయగలవు. సైబీరియా జ్వరానికి చైనా మాత్రలు బాగా పనిచేస్తాయిగాని జపానువారు మింగగలరా ?.

---

# వార్తలు - విశేషాలు.

## జపాను దురాశ.

జపానువారు బర్మాను ఆక్రమించిన పిమ్మట అక్కడనున్న భారతీయులను ఇండియాకు పోవుటకు అనుమతించినప్పటికి, కలేవావద్దను యితర సరిహద్దు బాటలవద్దను వారు వెడలివస్తున్న కాందిశీకుల వస్తువులన్ని వెదకిచూచి బంగారం, వెండి, తదితర విలువగల వేవైనావుంటే తీసుకుంటున్నారు కరెన్సీ నోటులువుంటే కాల్చేస్తున్నారు అని బర్మానుండి యిటీవల మదరాసు వచ్చినవారు చెప్పేరు.

* * *

## ఇండియాలో టేకు కర్ర.

ఇండియాలో సుమారు 100,00C ఎకరముల టేకు తోటలు గలవు. ఇంకా 5,000 టన్నుల ఎక్కువ యకరాలు టేకు వృక్షాలు ఏటేట నాటబడుచున్నవి. వేళ్లు, ముదరకొమ్మలు నాటుటవలన టేకు వృక్షాలు, టేకు తోటలు వేయబడును. మదరాసు రాష్ట్రంలో ఏటేట 1,500 ఎకరాలు క్రొత్తగ నాటబడును. అందుకు ఒక్క మదరాసుకే 2,000,000 నుండి 2,500,000 మొక్కలు సాలీనా కావాలి. అందుకు తగిన ఏర్పాటులు జరుగుచున్నాయి.

* * *

## బర్మా గ్రామాలపై బ్రిటిషు బాంబులు.

రాయలు విమానదళాలు రాత్రింబవళ్లు మేఘాల మధ్య దారి కనబడనిచోట్ల ఎగిరి, బర్మాలో జపానువారు నివాసమున్న గ్రామాలపై బాంబులు వేస్తునేవున్నాయి. ఆ విమానాలలో వెడలిన కలకత్తా విశ్వ విద్యాలయంలో న్యాయ శాస్త్రం చదివిన విద్యార్థి సార్జెంటు అబ్జర్వరు ఒకడు, బర్మా వాయువ్యభాగానవున్న కలెవాపురంపై తమ దళంవారు జరిపిన దాడినిగూర్చి యిట్లు తెలిపిరి :—" ఎగురుతూవుండగా మేము ఒక కొండను ఎదుర్కొంటున్నట్లు అకస్మాతుగ తెలుసుకొంటిమి. మా విమానం రెక్కల కొసలే నాకు అగుపడనంత దట్టంగానున్న మేఘాలలో ఎగురుచుంటిమి. అంత ఒకప్రక్కను పెద్ద కొండ కొద్దివందల అడుగుల దూరంలో అగుపడెను. వైమానికుడు వెంటనే ప్రక్కత్రిప్పి దాటి వచ్చిన లోయలోనే ఒక సర్కిలుకొట్టి మరింత ఎత్తుగ నెగిరి కొండను దాటగలిగెను. కలేవాపురముపైకి క్షేమంగాపోయి, గురిచూసి బాంబులువేసి మరలివచ్చితిమి."

ఆ వైమానికుడు ఇంగ్లాండులోనే వుద్యోగంలో చేరినా, ఇండియాలో పుట్టినవాడే. అతని తండ్రి కాన్పూరు నివాసి. కలేవాపై యీ దాడియందు మన బాంబరు విమానాలకు శత్రు ఫైటరు విమానా లేవియు అడ్డుతగులలేదు. దిగువనుండి ఫిరంగులు మాత్రం ప్రేలినవి. ఒక విమానం దిగువగ ఎగురుచుండగ, తోకకు ఒక బులెటు తగిలెను.

మన విమానాలన్నియు తమ బాంబుల బరువును జయప్రదంగా నేల శత్రుస్థానములపై పడవైచి, దాగియున్న జపానీయులను నది ఒడ్డునకు వచ్చునట్లు చేసెను.

* * *

## క్రొత్త సిపాయిల ఉత్సాహం.

పంజాబు జిల్లాలలో సంచారంచేసిన కమాండింగు ఆఫీసరు క్రొత్తగ చేర్చుకొనిన ఇండియను సిక్కుల్సు ట్రెయినింగు దళం సిపాయిలను సైనిక విలేఖరికి సగర్వంగా చూపెను. అందొక దృఢకాయుడగు శిక్కు యువకుని చూపి " వాడు చాల ఘట్టివా " డనెను. ఏమంటే, క్రొత్తవారిని చేర్చుకొన్నపుడు, యీతడు చిన్నవాడని నిరాకరింపబడెను. అతడు చిన్నబుచ్చుకొని చివరకు సేనానాయకునివద్దకు వచ్చి, ఎంచబడినవారిలో యెవరితోనైనా సరే తాను కుస్తీపట్టి తన అర్హత రుజువుచేసుకుంటాననెను. సేనాని అంతట వారందరి కావిషయం తెలుపగా, వారంగీకరించి ఒకరిని పంపిరి. కుస్తీలో యీ శిక్కు యువకుడు గెల్చి, శభాసనిపించుకొని, సైన్యంలో చేరెను.

ఒకనాడు సాయంకాలం యీ కర్నలు తన జట్టునంతా రైలులో తీసుకపోవలసివచ్చెను. వారందంకి రైలు ప్రయాణం క్రొత్త. అందుచే అతడు తటపటాయించుచుండగ, రైలు గార్డు వారికి సహాయంచేసెను. ప్రయాణం అయిన తరవాత కర్నలు ఆ గార్డునే " నీవేల సైన్యంలో చేరరాదు " అని నవ్వుతాలకు అడిగెను. అందు కాతడు వెంటనే అంగీకరించి కేంద్రస్థానమునకు వచ్చెను. అతని అర్హతను బట్టి అతడు సిక్కులు దళములో త్వరలో పెద్ద ఉద్యోగమునకు రాగలడు.

* * *

## నేరస్తులు బాగుపడుట.

ఈ కర్నలుకి క్రొత్త సైనికులు అనేకవిధాలుగ లభించిరి. ఒక గ్రామంలో ఒక తండ్రి కుమారు లిరువురు చిన్న నేరాలకు మేజస్ట్రేటుచే విచారింపబడుచున్నారని తెలిపెను. కర్నలుని పోయి విడిపింపకోరెను. కర్నలు కోర్టుకిపోయి మేజస్ట్రేటుతో మాట్లాడి, వారిద్దరిని సిక్కులు దళములో చేర్చుకొనెను. తన మాట వినని కుమారులు బాగుపడినందుకు తండ్రి సంతసించెను. వారు సైన్యంలో ఉత్సాహంగా చేరిరి. వారు యితరులకన్న ఎక్కువ తెలివితేటలతో పనిచేయుచున్నారని యజమాని తెలిపెను.

MADRAS : PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.